# అథ పంచదశో%ధ్యాయః

# తారకుని తపస్సు

బ్రహ్మోవాచ|

అథ సా గర్భ మాధత్త వరాంగీ తత్ప్రియాదరాత్ | స వవర్ధాభ్యంతరే హి బహువర్షై స్సుతేజసా || 1

తతస్సా సమయే పూర్ణే వరాంగీ సుషువే సుతమ్ | మాహాకాయం మహావీర్యం ప్రజ్వలంతం దిశో దశ || 2

తదైవ చ మహోత్పాతా బభూవుర్దుఃఖహైతవః | జాయమానే సుతే తస్మిన్ వరాంగ్యాస్తుర దుఃఖదే || 3

దివి భవ్యంతరిక్షే చ సర్వలోకభయంకరాః| అనర్థ సూచకాస్తాత త్రివిధాస్తాన్ బ్రవీమ్యహమ్ || 4

బ్రహ్మ ఇట్లు పలికెను-

అటు పిమ్మట వజ్రాంగుని ప్రియురాలగు ఆ వరాంగి గర్భమును ధరించెను. ఆ శిశువు ఆమె గర్భములోపల అనేక సంవత్సరములు గొప్ప తేజస్సుతో వర్ధిల్లెను(1). తరువాత , గర్భధారణ సమయము పూర్తి కాగానే ఆ సుందరి పెద్ద శరీరము గలవాడు, గొప్ప బలశాలి, పది దిక్కులను ప్రకాశింప జేయుచున్నవాడునగు కుమారుని కనెను. (2). ఆ సుందరికి దేవతలకు దుఃఖమును కలిగింపబోవు ఆ బాలుడు పుట్టుచుండగా , అదే సమయములో పీడను కలిగించు గొప్ప ఉత్పాతములు కలిగినవి (3). రాబోవు అనర్థమును సూచించు మూడు రకముల ఉత్పాతములు

ద్యులోకమునందు, భూలోకమునందు, మరియు అంతరిక్షమునందు కూడ కలిగెను. అవి సర్వప్రాణులకు భీతిని గొల్పెను. వాటిని నేను వివరించెదను(4).

సోల్కా శ్చాశనయః పేతుః మహాశబ్దా భయంకరాః |ఉదయం చక్రు రుత్కృష్టాః కంతవో దుఃఖదాయకాః || 5

చచాల వసుధా సాద్రిర్జజ్వలుస్సకలా దిశః |
చుక్షుభుస్సరితస్సర్వాస్సగరాశ్చ విశేషతః || 6

హుత్కరానీరయమ్ ధీరాన్ ఖరస్పర్శో మరుద్వవౌ| ఉన్మూలయన్ మహావృక్షాన్ వాత్యానీకో రజోధ్వజః|| 7

సరాహ్వోస్సూర్య విధ్వోస్తు ముహుః పరియోఽభవన్|
మహాభయస్య విప్రేంద్ర సూచకాస్సుఖహారకాః || 8

భయమును కలిగించే ఉల్కలు, పిడుగులు గొప్ప శబ్దమును చేయుచూ పడినవి దుఃఖమును కలిగించే క్రూర జంతువులు

పుట్టజొచ్చినవి(5). భూమి, దానితో బాటు పర్వతములు కపించినవి . దిక్కులన్నియూ మండినవి . సర్వనదులతో బాటు సముద్రములు విశేషించి క్షోభను పొందినవి(6). తుఫాను గాలులే సైన్యముగా కలిగినట్టియు, ధూళియే ధ్వజముగా గల వాయుదేవుడు పెద్ద శబ్దమును విచిత్ర ధ్వనులను చేయుచూ. సర్వ చేతనే పీడను కలిగించుచూ, పెద్ద వృక్షములను పెకలించుచూ వీయజొచ్చెను(7). రాహువుతో కూడిన సూర్య చంద్రుల చుట్టూ తరచుగా కాంతి మండలము లేర్పడెను. ఓ ద్విజశ్రేష్ఠా! సుఖమును అపహరించు ఈ ఉత్పాతములు రాబోవు మహాభయమును సూచించుచుండెను(8).

మహీధ్రవివరేభ్యశ్చ నిర్ఘాతా భయసూచకాః | రథనిర్ఘాతులాశ్చ జజ్ఞిరేఽవసరే తతః || 9

సృగాలోలూ కటంకారైర్వమంత్యో ముఖతోఽనలమ్| అంతర్ గ్రామేషు వికటం ప్రణ   దురశివాశ్శివాః || 10

యతస్తతో గ్రామసింహా ఉన్నమయ్య శిరోధరామ్ | సంగీతవద్రోదన వద్ధ్యముంచన్ వివధాన్ రవాన్ || 11

ఖార్కారరభసా మత్తాః ఖురైర్ఘ్నన్తో రసాం ఖరాః | వరూథశస్తదా తాత పర్యధావన్నితస్తతః || 12

ఆ సమయములో కొండ గుహలనుండి భయమును కలిగించే రథశబ్దమును పోలియున్న శబ్దము గల భూకంపములు పుట్టినవి(9). ఆమంగళకరములగు నక్కలు నోటినుండి నిప్పులను గ్రక్కుచూ గ్రామముల మధ్యలో కర్ణ కఠోరమగు శబ్దములను చేసినవి. వీటికి గుడ్ల గూబల ధ్వనులు తోడయ్యెను(10). కుక్కలు ఇటునటుల తిరుగుచూ శిరస్సులను పైకెత్తి నేలను తన్నుచూ ఒకప్పుడు సంగీతమును, మరియొకప్పుడు ఏడ్పులను చేయుచూ అనేక శబ్దములను చేసినవి(11). వత్సా! ఆ సమయములో మదించిన గాడిదలు గుంపులు గుంపులుగా ఇటునటు పరుగెత్తుచున్నవై కర్కశముగా ఓండ్రపెట్టుచున్నవై గిట్టలతే నేలను తన్నుచుండెను.(12)

ఖగా ఉదపతన్నీడా ద్రజనత్రస్తమానసాః | క్రోశంతో వ్యగ్రచిత్తాశ్చ స్థితిమాపుర్న కుత్రచిత్ || 13

శకృన్మూత మకార్షుశ్చ గోష్ఠేఽరణ్యే   భయాకులాః| బభ్రముస్థ్సితిమాపుర్నో పశవస్తాడితా ఇవ|| 14

గోవోఽత్ర సన్నసృగ్దోహా బాష్పనేత్రా భయాకులాః| తోయదా అభవంస్తత్ర భయదాః పూయవర్షిణః || 15

వ్యరుదన్ ప్రతిమాస్తత్ర దేవానాముత్పతిష్ణవః | వినాఽనిలం ద్రుమాః పేతు ర్గ్రహ యుద్ధం బభూవ ఖే || 16

భీకరశబ్ధములచే భయమును చెందిన పక్షులు ఏడ్చుచూ గూళ్లనుండి ఎగిరిపోయినవి. అవి ఒకచోట స్థిరముగా కుర్చుండలేకపోయినవి(13). పశువులు ఎవరో కొడుతున్నారా యన్నట్లు పశువులశాలలో గాని, అడవిలో గాని స్థిరముగా నుండలేక ఇటునటు తిరుగుతూ మలమూత్రములను విసర్జించినవి(14). గోవులు భయముచే వ్యాకులితములై కనులవెంబడి నీరు గార్చుచూ పాలకు బదులుగా రక్తమును స్రవించినవి. మేఘములు భయము కలుగు విధముగా చీమును వర్షించినవి(15). దేవతా ప్రతిమలు ఎగిరిపడుతూ రోదించినవి. గాలి లేకుండగనే చెట్లు నేల గూలినవి. ఆకాశమునందు గ్రహముల మధ్య రగడ చెలరేగెను.(16)

ఇత్యాదికా బహుత్పాతా జజ్ఞిరే మునిసత్తమ| అజ్ఞానినో జనాస్తత్ర మేనిరే విస్వసంప్లవమ్ || 17

అథ ప్రజాపతిర్నామాకరోత్తస్యాసురస్యవై | తారకేతి విచార్యైవ కశ్యపో హి మహౌజసః || 18

మహావీరస్స సహసా వ్యజ్యమానాత్మ పౌరుషః| వవృధేత్మశ్మ సారేమ కాయేనా ద్రిపతిర్యథా|| 19

అథ స తారకో దైత్యో మహాబలపరాక్రమః| తపః కర్తుం జనన్యాశ్చాజ్ఞాం యయాచే మహామనాః|| 20

ఓ మహర్షీ! ఈ తీరున బహు విధముల ఉత్పాతములు పుట్టినివి. అచటి అజ్ఞానులగు జనులు జగత్తునకు ప్రలయము వచ్చుచున్నదని తలపోసిరి. (17) తరువాత కశ్యప ప్రజాపతి విమర్శలను చేసి, మహాతేజశ్శాలియగు ఆ రాక్షస బాలకునకు తారకుడని పేరు పెట్టెను(18). మహా వీరుడు , ప్రకటింపబడుచున్న స్వీయ పౌరుషము గలవాడు నగు ఆ తారకుడు పర్వతమువలె పాషాణదృఢమగు శరీరముతో

శీఘ్రముగా పెరుగ మొదలిడెను.(19) గొప్ప బలపరాక్రమములు గలవాడు, దృఢచిత్తము గలవాడునగు ఆ తారకుడపుడు తపస్సును చేయుటకు తల్లి ఆజ్ఞను వేడుకొనెను.(20)

ప్రాప్తాజ్ఞస్స మహామాయీ మాయినా మపి మోహనః | సర్వ దేవజయిం కర్తు తపోర్థం మన ఆదధే|| 21

మధోర్వనముపాగమ్య గుర్వాజ్ఞా ప్రతిపాలకః| విధిముద్దిశ్య విధివత్తపస్తేపే సుదారుణమ్|| 22

ఊర్ధ్వ బాహుశ్చైకపాదో రవిం పశ్యన్ స చక్షుషా | శతవర్షం తపశ్చక్రే దృఢచిత్తో దృఢవ్రతః|| 23

అంగుష్ఠేన భువం సపృష్ట్వా శతవర్షం చ తా దృశః | తేపే తపో దృఢాత్మా స

తారకో%సురరాట్ ప్రభుః || 24

మాయావులనైనా మోహింప చేయగలిగే ఆ మాహామాయావి తల్లి ఆజ్ఞను పొంది, దేవతలనందరినీ జయించుటకై తపస్సును చేయుటకు మనస్సులో నిశ్చయించుకొనెను(21). పెద్దల ఆజ్ఞను పాలించి అతడు మధువలమును చేరి బ్రహ్మ గారినుద్దేశించి మిక్కిలి తీవ్రముగు తపస్సును యథావిధిగా చేసెను.(22) అతడు చేతులు పైకెత్తి ఒక కాలిపై నిలబడి సూర్యుని చూచుచూ దృఢమగు మనస్సు దృఢమగు దీక్ష గలవాడై వంద సంవత్సరములు తపస్సు చేసెను(23). దృఢనిశ్చయము గలవాడు, రాక్షసులకు అధీశ్వరుడు అగు ఆ తారకుడు బొటన వ్రేలిపై నిలబడి అదే తీరున వంద సంవత్సరములు తపస్సు చేసెను(24).

శతవర్షం జలం ప్రాశ్నన్ శతవర్షం చ వాయు భుక్ | శతవర్షం జలే తిష్ఠన్ శతం చ స్థండి లే%తపత్|| 25

శతవర్షం తథా చైగ్నౌ శతవర్షమదోముఖః| శతవర్షం తు హస్తస్య తలేన త భువం స్థితః || 26

శతవర్షం తు వృక్షస్య శాఖామాలంబ్య వై మునే | పాదాభ్యాం శుచిధూమం హి పిబంశ్చాధోముఖస్తథా|| 27

ఏవం కష్టతరం తేపే సుతపస్స తు దైత్యరాట్ | కామముద్ధిశ్య విధివచ్ఛృణ్వతామపి దుస్సహమ్|| 28

అతడు వంద సంవత్సరములు నీటిని మాత్రమే త్రాగుచూ , వంద సంవత్సరములు గాలిని మాత్రమే భక్షించి, వంద సంవత్సరములు నీటిలో నిలబడి, మరియు వంద సంవత్సరములు నేలపై నిలబడి తపస్సును చేసెను (25). వంద సంవత్సరములు అగ్నుల మధ్యలో , వంద సంవత్సరముల శీర్షాసనములో మరియు వంద సంవత్సరములు అరిచేతిపై నేలమీద నిలబడి తపస్సును చేసెను(26). ఓ మహర్షీ! వంద సంవత్సరములు చెట్టు కొమ్మనుండి కాళ్లతో వ్రేలాడుతూ , మరియు క్రిందకు వ్రేలాడు ముఖముతో నిప్పులనుండి వెలువడు పొగను త్రాగి తపస్సును చేసెను.(27) ఈ విధముగా ఆ రాక్షస రాజు వినువారలకు కూడ సంహింపశక్యము గాని ఘోరతపస్సును తన కోరిక సిద్ధించుటకై యథా విధిగా చేసెను(28).

తస్మై#్యవం తపతస్తస్య మహాతేజో వినిస్సృతమ్ | శిరసస్సర్వసంసర్పి మహోపద్రవకృన్మునే|| 29

తేనైవ దేవలోకాస్తే దగ్ధప్రాయా బభూవిరే| అభితో దుఃఖమాపన్నా స్సర్వే దేవర్షయా మునే || 30

ఇంద్రశ్చ భయమాపేదే%ధికం దేవేశ్వరస్తదా| తపస్యత్యద్య కశ్చిద్వై మత్పదం ధర్షయిష్యతి || 31

అకాండే చైవ బ్రహ్మాండం సంహరిష్యత్యయం ప్రభుః | ఇతి సంశయమాపన్నా నిశ్చయం నోపలేభిరే || 32

ఇట్లు తపస్సును చేయుచున్న ఆ తారకుని శిరస్సు నుండి గొప్ప తేజస్సు బయల్వెడలి అంతటా వ్యాపించి గొప్ప విపత్తును కలిగించెను. ఓ మహర్షీ!(29). దానిచే ఆ దేవలోకములు దహింపబడుచున్నవా అన్నట్లుండెను. ఓ మునీ! దేవతలు,మునులు అందరూ అన్ని వైపుల నుండియూ దుఃఖమును పొందిరి (30). అపుడు దేవరాజగు ఇంద్రుడు కూడా'వీడేవడో తపస్సును చేసి నా పదవిని ఊడలాగుకొనునేమో !'అని భయపడెను. (31) పరమేశ్వరుడు అకాలములో బ్రహ్మాండ ప్రలయమును చేయుచున్నాడని దేవతలు సందేహమును పొందిరి. వారికి నిశ్చయము కలుగలేదు(32). తతస్సర్వే సుసంమంత్ర్య మిథస్తే నిర్జరర్షయః | మల్లోకమగమన్ భీతా దీనా మాం సముపస్థితాః || 33

మాం ప్రణమ్య సుసంస్తూయ సర్వే తే క్లిష్టచేతసః | తృతస్వాంజలయో మహ్యాం వృత్తం సర్వం న్యవేదయన్ || 34

అహం సర్వం సునిశ్చిత్య కారణం తస్య సద్ధియా| వరం దాతుం గతస్తత్ర యత్ర తప్యతి సో%సురః|| 35

అవోచం వచనం తం వై వరం బ్రూహీత్యహం మునే| తపస్తప్తం త్వయా తీవ్రం నాదేయం విద్యతే తవ|| 36

ఇత్యేవం మద్వచశ్శ్రుత్వా తారకస్స మహాసురః | మాం ప్రణమ్య సుసంస్తూయ వరం వవ్రే%తిదారుణమ్|| 37

అపుడు ఆ దేవతలు, మునులు అందరు పరస్పరము చర్చించుకొని భయముతో దీనులైనా లోకమునకు వచ్చి నన్ను సమీపించిరి (33). దుఃఖముతో గూడిన మనస్సు గల వారందరు చేతులు ఒగ్గి నాకు నమస్కరించి స్తుతించి వృత్తాంతమునంతనూ

నివేదించిరి (34). ఆ లోకోపద్రవమునకు గల కారణమును నేను విమర్శ చేసి నిశ్చయించి, ఆ రాక్షసుడు తపము చేయుచున్న స్థలమునకు వరమునిచ్చుటకై వెళ్లితిని (35). ఓ మహర్షీ! నేనాతనితో నిట్లనింటిని వరమును కోరుకొనుము , నీవు తీవ్రమగు తపస్సును చేసియుంటివి . నీకు ఈయరాని వరము లేదు(36). ఈ నా మాటను విని మహా సురుడగు ఆ తారకుడు నాకు నమస్కరించి చక్కగా స్తుతించి మిక్కిలి దారుణమగు వరమును కోరుకొనెను,(37)

తారక ఉవాచ|

త్వయి ప్రసన్నే వరదే కిమసాధ్యం భ##వేన్మమ| అతో యాచే వరం త్వత్తస్శృణు తన్మే పితామహ||38

యది ప్రసన్నో దేవేశ యది దేయో వరో మమ | దేయం వరద్వయం మహ్యం కృపాం

కృత్వా మమోపరి||39

త్వయా చ నిర్మితే లోకే సకలే%స్మిన్మహో ప్రభో| మత్తుల్యో బలవాన్నానం భ##వేత్కో%పి వై పుమాన్ || 40

శివవీర్యసముత్పన్నః పుత్రస్సేనా పతిర్యదా| భూత్వా శస్త్రం క్షిపేన్మహ్యం తదా మే మరణో భ##వేత్ || 41

తారకుడిట్లు పలికెను-

వరములనిచ్చు నీవు ప్రసన్నుడవైనచో, నాకు సాధ్యము కానిది ఏమి ఉండును? హే పితామహా! నేను నీ నుండి కోరు వరమును చెప్పెదను. వినుము(38). హే దేవదేవా! నీవు నా యందు ప్రసన్నుడవై, నాకు వరమునీయ నిశ్చయించినచో , నాపై దయ ఉంచి నాకు రెండు వరముల నీయవలెను. (39). హే మహాప్రభో! నీవు నిర్మించిన బ్రహ్మండములో ఎక్కడైననూ నాతో సమమగు

బలముగల పురుషుడు మరియొక్కడు ఎవడైననూ ఉండరాదు. ఇది నిశ్చయము(40). శివుని వీర్యముచే పుట్టిన కుమారుడు సేనాపతియై ఏనాడు నా పై ఆయుధమును ప్రయోగించునో, అపుడు మాత్రమే నాకు మరణము కలుగవలెను(41).

ఇత్యుక్తో%థ తదా తేన దైత్యేనాహం మునీశ్వర | వరం చ తాదృశం దత్వాం స్వలోకమగమం ద్రుతమ్ || 42

దైత్యో%పి స వరం లబ్ధ్వా మనసేప్సితముత్తమమ్| సుప్రసన్న తరో భూత్వా శోణితాఖ్యపురం గతః || 43

అభిషిక్తస్తదా రాజ్యే త్రైలోక్యస్యాసురై స్సహ| శుక్రేణ దైత్య గురణాజ్ఞయా మే స మహాసురః || 44

తతస్తు స మహాదైత్యో%భవత్ త్రైలోక్యనాయకః | స్వాజ్ఞాం ప్రవర్తయామాస పీడయన్ సచాచరమ్|| 45

ఓ మహర్షీ! ఆ రాక్షసుడు అపుడు నాతో అట్లు పలుకగా, నేను ఆ వరములనిచ్చి వెంటనే నా లోకమునకు తిరిగి వచ్చితిని (42). ఆ రాక్షసుడు తాను కోరిన గొప్ప వరములను పొంది మిక్కిలి ప్రసన్నుడై శోణితమను పేరు గల నగరమును చేరెను(43). అపుడు రాక్షసగురువగు శుక్రుడు నా ఆజ్ఞను పొంది ఆ మహాసురుని రాక్షసుల సన్నిధిలో ముల్లోకములకు రాజుగా అభిషేకించెను. (44) అపుడా మహా రాక్షసుడు ముల్లోకములకు ప్రభువై, స్థావర జంగమములగు ప్రాణులను పీడించుచూ తన ఆజ్ఞను ప్రవర్తిల్లజేసెను.(45)

రాజ్యం చకార విధివత్త్రిలోకస్య స తారకః | ప్రజాశ్చ పాలయామాస పీడయన్నిర్జరాదికాన్ || 46

తతస్స తారకో దైత్యస్తేషాం రత్నాన్యుపాదదే | ఇంద్రాదిలోకపాలానాం స్వతో దత్తాని తద్భయాత్ || 47

ఇంద్రేణైరావతస్త స్య భయాస్త స్య భయాత్తసై#ౕ సమర్పితః |
కుబేరేణ తదా దత్తా నిధయో నవసంఖ్యాకాః || 48

వరుణ  న హయాశ్శుభ్రా ఋషిభిః కామకృత్తథా|
సూర్యేణోచ్చైశ్శ్రవా దివ్యో భయాత్తసై#ౕ సమర్పితః || 49

ఆ తారకుడు ముల్లోకములలో యథావిధిగా రాజ్యమునేలెను. అతడు దేవతలు మొదలగు వారిని పీడించుచూ, ఇతర ప్రజలను పాలించెను. (46). తరువాత ఆ తారకుడు వారి శ్రేష్ఠవస్తువులను లాగుకొనెను. ఇంద్రుడు మొదలగు దేవతలు ఆ రాక్షసునకు భయపడి శ్రేష్ఠవస్తువులను స్వయముగా అతనికి సమర్పించిరి. (47). ఇంద్రుడు భయముతో తన ఐరావత గజమును అతనికి సమర్పించెను. కుబేరుడు నవనిధులను ఇచ్చివేసెను(48). వరుణుడు తెల్లని, గుర్రములను, సూర్యుడు దివ్యమగు ఉచ్చైశ్శ్రవమును భయముతో అతనికిచ్చివేసిరి. ఋషులు కోర్కెల నీడేర్చు కామధేనువు నిచ్చిరి(49).

యత్ర యత్ర శుభం వస్తు దృష్టం తేనాసురేణ హి| తత్తద్గృహీతం తరసా నిస్సారస్త్రి భవో%భవత్ ||50

సముద్రాశ్చ తథా రత్నన్యదుస్తసై్మ భయాన్మునే | అకృష్ట పచ్యాసీత్పృథ్వీ ప్రజాః కామదుఘా%ఖిలాః ||51

సూర్యశ్చ తపతే తద్వత్ తద్దుఃఖం న యతా భ##వేత్|
చంద్రస్తు ప్రభయా దృశ్యో వాయుస్సర్వానుకూలవాన్ || 52

దేవానాం చైవ యద్ద్రవ్యం పితౄణాం చ పరస్య చ | తత్సర్వం సముపాదత్త మసురేణ దురాత్మనా|| 53

ఆ రాక్షసుడు ఎక్కడెక్కడ ఏయే శుభవస్తువు కంట పడినా, దానిని తీసుకొని వెళ్లెను. ఇట్లు ముల్లోకములు సారహీనములయ్యెను (50). ఓ మహర్షీ! సముద్రములు వానికి భయపడి తమలోని రత్నములను ఇచ్చివేసినవి. భూమి దున్నకుండగనే పంటలు

పండినవి. ప్రజలందరు రాజుయొక్క కోర్కెలను దీర్చిరి(51). వానికి దుఃఖము కలుగకుండునట్లు సూర్యుడు ప్రకాశించెను. చంద్రుని కాంతి హవిర్భాగములను సర్వమును లాగుకొనెను. మరియు అతడు ఇతరులందరి సంపదలను హరించి వేసెను. (53).

éవసీకృత్య స లోకాం స్త్రీన్ స్వయమింద్రో బభూవ హ | అద్వితీయః ప్రభుశ్చాసీద్రీజ్యం చక్రే%ద్భుతం వశీ|| 54

నిస్సారర సకలాన్ దేవాన్ దైత్యాన స్థాపయిత్తతః| స్వయం నియోజయామాస దేవయోనీస్స్వకర్మణి|| 55

అథ తద్బాధితా దేవాస్సర్వే శక్రపురోగమాః | మునేం మాం శరణం జగ్మర నాథా అతివిహ్వలాః || 56

ఇతి శ్రీ శివ మహాపురాణ   రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే తారకాసుర తపోరాజ్య

వర్ణనం నామ పంచదశో%ధ్యాయః(15).

అతడు ముల్లోకములను వశము చేసుకొని తానే ఇంద్రపదవి నధిష్ఠించి ఏకైక ప్రభువు అయి, సర్వమును తన వశమునందుంచుకొని , అద్భుతముగా రాజ్యమును చేసెను. (54). అపుడాతడు దేవతలనందరినీ వెళ్ల గొట్టి ఆ స్థానములలో రాక్షసులను స్వయముగా నియమించెను. గంధర్వాది దేవగణములను తన సేవకులుగా నియమించుకొనెను(55). ఓ మహర్షీ !అపుడు వానిచే పీడింపబడిన ఇంద్రాది దేవతలందరు దిక్కు తోచనివారై మహా దుఃఖముతో నన్ను శరణు జొచ్చిర(56).

శ్రీ శివ మహాపురాణ   రుద్ర సంహితాయాం పార్వతీ ఖండలో తారకాసురుని తపస్సు. రాజ్యము వర్ణన అనే పదునైదవ అధ్యాయము ముగిసినది(15).

